e-book



డా॥ తలతోటి పృథ్వీరాజ్ రచించిన

# పృథ్వి కూనలమ్మ పదాలు





**INDIAN HAIKU CLUB**

Faith Home, Sai Colony, Kotturu Panchayathi Road

ANAKAPALLI, VISAKHAPATNAM Dist. A.P. INDIA

talathotiprithviraj@gmail.com WhatsApp: 9963299452

www.litt.in www.talathoti.com

e-Book Series-2

డా॥ తలతోటి పృథ్వీరాజ్ రచించిన

# పృథ్వి కునలమ్మ పదాలు






**INDIAN HAIKU CLUB PUBLICATIONS**
Faith Home, Sai Colony, Kotturu Panchayathi Road
ANAKAPALLI-531001, Visakhapatnam Dist. A.P., INDIA.
talathotiprithviraj@gmail.com Whatsapp: 9963299452
www.litt.in www.talathoti.com

PRITHVI KUNALAMMA PADAALU

*Poetry by Dr.Talathoti Prithvi Raj*

# పృథ్వీ కూనలమ్మ పదాలు

- డాక్టర్ తలతోటి పృథ్వీరాజ్.


ప్రచురణ : సెప్టెంబర్ 6, 2020 .

ప్రచురణ కర్త :

ఇండియన్ హైకూ క్లబ్ ప్రచురణలు,

అనకాపల్లి-531001. ఆంధ్రప్రదేశ్.





చిరునామ:

డా॥తలతోటి పృథ్వీరాజ్

ఇండియన్ హైకూ క్లబ్, ఫెయిత్ హోమ్, సాయినగర్,

కొత్తూరు పంచాయితీ ఆఫీస్ రోడ్డు ,

అనకాపల్లి- 531 001.

డా॥ తలతోటి పృథ్వీరాజ్, తెలుగు అధ్యాపకుడు,

ప్రభుత్వ డిగ్రీకళాశాల,

పెరుమాళ్ళపురం.

తూర్పుగోదావరి జిల్లా.





ముఖచిత్రం, చివరిపేజీ, కవితా

చిత్రాలు డిజైనింగ్ మరియు

డి.టి.పి. :

డా॥తలతోటి పృథ్వీరాజ్.



చరవాణి: 8074004711.

వాట్సాప్: 9963299452.

# అంకితం

కావ్యాన్ని రచించిన వారిని కృతి కర్త అని, ఆ కావ్యాన్ని స్వీకరించినవారిని కృతి స్వీకర్త, కృతి భర్త అని అంటారు. ఇలా కావ్యాలను రచించిన కవులు తాము అభిమానించే, ఇష్టపడే, తమను ప్రోత్సహించే, ఆర్థిక తోడ్పాటునందించే రాజులకు అంకితమిచ్చే సంప్రదాయం మనం ప్రాచీన సాహిత్యకాలంలో చూడవచ్చు. ఇంకొందరు వారి ఇష్టదైవానికి వారి కావ్యాల్ని అంకితం చేసినవారెందరో!

ఆంధ్ర మహాభారతాన్ని ఆదికవి నన్నయ్య ఆంధ్ర మహాభారతాన్ని రాజరాజనరేంద్రునికి, శ్రీనాథుడు తన "శృంగార నైషధం"ను మామిడి సింగనకు, ప్రబంధ కవి పెద్దన "మనుచరిత్ర"ను శ్రీకృష్ణదేవరాయలకు, చేమకూర వెంకటకవి తన "విజయ విలాసం"ను రఘునాథ నాయకుడికి, రామరాజ భూషణుడు తన ''వసు చరిత్ర''ను తిరుమల దేవరాయలకు, పింగళి సూరన తన "కళాపూర్ణోదయం"ను నంద్యాల కృష్ణమరాజుకు ఇలా ఎందరో కవులు వారి కావ్యాలను అంకితం చేశారు.

పోతన తన "భాగవతం"ను రామునికి, ధూర్జటి తన "కాళహస్తీశ్వర మహాత్మ్యం, కాళహస్తీశ్వర శతకం" లను శివునికి, శ్రీకృష్ణదేవరాయలు తన "ఆముక్తమాల్యద"ను శ్రీ వేంకటేశ్వర స్వామికి అంకితమిచ్చారు. ఇలా ఎందరో కవులు. అందుకే-

"కవి కన్న తల్లి గర్భంబు ధన్యంబు;

కృతిని జెందువాడు మృతుడుగాడు" అని పిరదౌసి లేఖలో జాషువా అంటాడు.

ఒక కవి భావనా రచన సజీవమైనదైనప్పుడు దాని స్వీకర్త సాహిత్యంలో నిలిచే ఉంటాడనడంలో సందేహమే లేదు! కవులు ఆత్మీయులకు ఇంతకన్న ఇచ్చే లక్షలు కన్న విలువైన కవితాక్షరాలు తప్ప మరేముంటాయి!



గుంటూరుజిల్లా, నాదెండ్లమండలం, తూబాడు గ్రామంలోని జిల్లా పరిషత్ హైస్కూల్లో నేనేమో ఆరో తరగతి చదివే రోజులు... మా బాబాయేమో విజయవాడ,ఆంధ్రా లయోలా కాలేజీలో బి.ఎ. తెలుగు లిటరేచర్ చదివే రోజులు.! అప్పుడప్పుడు దొరలు ఇండియాలో దిగినట్లు అప్పుడప్పుడు సెలవులకు దొరగారిలాగే చలువ కళ్ళజోడుతో అచ్చం సినిమా హిరోలాగే మా బాబాయ్‌కూడా స్వగ్రామం తూబాడులో దిగేవాడు. నేనూ ఇలాగే చదువుకోవాలి అని లోలోపల ఒక ఆలోచన . మున్నెన్నడూ, ఎక్కడా పంచుకోని నా అనుభూతి ఇది. కాలగమనంలో ఆరునుండి ఇంటర్ పూర్తయ్యాక అదే ఆంధ్రాలయోలా కాలేజీలో బి.ఎ.తెలుగు లిటరేచర్ చేరి పూర్తిచేశాను. ఆతర్వాత హైద్రాబాద్ సెంట్రల్ యూనివర్శిటీ ఎం.ఎ. తెలుగు లిటరేచర్, అటుతర్వాత జె.ఆర్.ఎఫ్.ఫెలోషిప్ తో పిహెచ్.డి., ౨౦౦౦సం॥తో అధ్యాపకునిగా ఉద్యోగం! మా బాబాయ్ ప్రేరణతో వేసిన అడుగులు నన్ను ఇలా ఉన్నత శిఖరానికి చేర్చాయి.

నేను చదివిన ఈ చదువుకు ప్రేరణ మా బాబాయే! బాబాయ్... అందుకే ఈ కవిత్వంతో నిన్ను సన్మానించుకోవాలనే .... .

"పృథ్వి కూనలమ్మ పదాలు" కవితా సంపుటి

**"శ్రీ తలతోట ఏసుమాణిక్యరావు "** బాబాయ్‌కు

అంకితం

-డా॥తలతోటి పృథ్విరాజ్

# కూనలమ్మగూర్చి కొంచెం....

- డా॥తలతోటి పృథ్విరాజ్

"కూనలమ్మ పదాలు" అనే తెలుగు సాహితీ ప్రక్రియ పేరు వినగానే గుర్తుకు రావాల్సిన పేరు ఆరుద్ర. సహజంగానే ఆరుద్ర అంత్యప్రాసల ప్రియుడు. అంత్యప్రాసల కవిత్వంతో అలరిస్తారు. అటువంటి అంత్యప్రాసే ఈ కవితా ప్రక్రియకు ఆత్మ అని చెప్పవచ్చు.

నాలుగు పాదాలతో, మాత్రా ఛందో నియమంతో రాయబడే కవితా ప్రక్రియ కూనలమ్మ పదాలు. ఒకో పాదం 10 మాత్రలతో, నాల్గవ పాదం 8 మాత్రలతో రాయబడుతుంది. కూనలమ్మ పదాలలో నాల్గవ పాదం శతక మకుటంలా "ఓ కూనలమ్మ" అని రాయబడుతుంది. ఒకవిధంగా యతిస్థాన నియమంలేని దీనిని మాత్రా ఛందస్సు శతక పద్యం అనవచ్చు.

ఆరుద్రగారి ప్రేరణతో రాసిన అనేకులు "ఓ కూనలమ్మ" అనే మకుటానికి భిన్నంగా " ఓ గూగులమ్మ, ఓ కోకిలమ్మ, ...ఇలా వివిధ రకాలుగా రాశారు. అలా మకుటం మార్చి రాయడంలో వారి ఉద్దేశం ఏమైనప్పటికీ నామట్టుకు నేనైతే ఆరుద్రగారు ఉపయోగించిన మకుటాన్నే ప్రయోగిస్తూ రాశాను. కారణం కవితా ప్రక్రియ పేరే కూనలమ్మ పదాలు.

ఆరుద్రగారు అనేక విషయాలను కూనలమ్మ పదాలలో చమత్కార ధోరణితో చెబితే నేను నా పంథాలో వ్యంగ్యంగా, చురకలు వేస్తూ చెప్పడమే నా శైలిగా కూనలమ్మ పదాలను రచించాను. అంతేకాకుండా వస్తువైవిధ్యాన్ని ప్రదర్శిస్తూ కూనలమ్మ పదాలను రచించాను. సామాజిక ప్రయోజనమే పరమావధిగా, ఉపదేశాత్మకంగా అనేక కూనలమ్మ పదాలు రాశాను. లఘుకవితా ప్రక్రియల పోషకునిగా ,వ్యాపకునిగా ఈ కూనలమ్మ పదాలను నేను రాయడం జరిగింది. ఇందులోని కొన్ని కూనలమ్మ పదాలను నా వ్యాఖ్యానంతో వీడియోగా రూపొందించి అందరికీ అందుబాటులో ఉండేలా యుూట్యూబ్‌లో ఉంచాను.

ప్రక్రియ ఏదైతేనేమి? భావం ముఖ్యం! ప్రక్రియను లక్షణాల్ని అనుసరించి రాశామా లేదా అనేదే ముఖ్యం. అన్నింటికి మించి "చక్కగా చెప్పాడు"అని పాఠకుడు అనుకునేలా రాయడమే ముఖ్యం. శిల కాగితమైతే ఉలి కలం! హృదయంలోని భావన చేతిలోని ఉలిలాంటి కలంతో చక్కని కవితా శిల్పంగా మలచడమే కవిత్వ కళ.

ప్రచురించిన పృథ్విరాజ్ ఈ-బుక్స్

01) మినీ మిరపకాయలు
02) నేనూ - ఆత్రేయ
03) "శతాబ్ది రక్కసి" హైకూ సంకలనం
04) "పృథ్వి కూనలమ్మ పదాలు"

త్వరలో రానున్న ఈ-బుక్స్

01) ఇక్కడ (కవితా చరక(త్తు)లు)
02) బి.వి.బంగార్రాజు పద్యకవిత్వం- పృథ్విరాజ్ వ్యాసరవళి
03) అరకు హైకూలు
04) అనకాపల్లి హైకూలు
05) మార్నింగ్ వాక్ హైకూలు
06) పృథ్వి హైబున్
07) సాహితీ హైకూలు
08) పృథ్వి ఫోటో హైకూ-2
09) 'ఇల్లు' దీర్ఘకవిత
10) మోదుకూరి జాన్సన్ సినీ సాహిత్యం
11) మైలవరపు గోపి సినీ సాహిత్యం- ఒక పరిశీలన
12) మన'సు'కవి
13) ఆత్రేయ సినిమా సంభాషణలు- ఒక పరిశీలన
14) ఆత్రేయ సాహిత్య వ్యాస సంపుటి
15) కలశం (సాహిత్య వ్యాస సంపుటి)
16) పృథ్వి హైగా
17) పృథ్వి సెన్‌ర్యూ-2
18) సీతాకోక చిలుకలు (హైకూలు)
19) (వచన కవితలు)
20) పృథ్వి శతకం
21) బైబిల్ తంకాలు

మరెన్నో...

రోదసికి రాకెట్లు
నేలకు ఒరుగు చెట్లు
ఓజోన్ పొరకు తూట్లు
ఓ కూనలమ్మ!






కాదు ప్రజారాజ్యం
లేదు ప్రజాస్వామ్యం
దేశప్రగతి పూజ్యం
ఓ కూనలమ్మ!



బాల్య దశలో ఒడికి
వయసులో సఖి ఒడికి
వార్ధక్యాన గుడికి
ఓ కూనలమ్మ!




కావు జన పత్రికలు
పార్టీల పుత్రికలు
ఫోర్త్ ఎస్టేటస్థికలు
ఓ కూనలమ్మ!

కొరివి పెట్టును సుతులు
కూడు పెట్టు కూతులు
ఆడబిడ్డలె మేలు
ఓ కూనలమ్మ!






ఖనిజాలతో గనులు
దోచి దాయును ఘనులు
డీల్‌కుదిరిన దొంగలు
ఓ కూనలమ్మ!



ఆ-డది కాదాడది
మమత తడి ఆరనిది
ఇలలో దేవతైనది
ఓ కూనలమ్మ!



చదవడం ఒక సొత్తు
బతకడం ఒక ఎత్తు
జీవితం గమ్మత్తు
ఓ కూనలమ్మ!

జీవితం నాటకం
మమతలూ బూటకం
జనన మరణ పటకం
ఓ కూనలమ్మ!







పి.ఎమ్.తుమ్మిన చాలు
యు.ఎస్. దగ్గిన వాలు
షేర్లు బూడిద పాలు
ఓ కూనలమ్మ!

ఓట్లు అమూల్య హక్కు
నోట్లు పంచిన దక్కు
కోట్లు నేతలు నొక్కు
ఓ కూనలమ్మ!





హృదిలో ఆశల చిత్తడి
మమతల మది ఇత్తడి
మానవతే పుత్తడి
ఓ కూనలమ్మ!

పోలీసులు - దొంగలు
రౌడీలు - నాయకులు
ఆదర్శ స్నేహితులు
ఓ కూనలమ్మ!






గడప ముంగిట అమ్మ
పెడుతుంది గొబ్బెమ్మ
సంస్కృతి పట్టుగొమ్మ
ఓ కూనలమ్మ!



కలిపేయును పొత్తులు
విడదీయును ఎత్తులు
రాజకీయ జిత్తులు
ఓ కూనలమ్మ!




ధరలు ధరపై లేవు
దేశమంతా కరువు
ప్రభుకు వెతలు చేరవు
ఓ కూనలమ్మ!

తెల్లదొరలు పోయెను
నల్లదొరలు వచ్చెను
దోపిడీలు హెచ్చెను
ఓ కూనలమ్మ!






భూతాపం పట్టదు
కాలుష్యం గిట్టదు
నివారణ తట్టదు
ఓ కూనలమ్మ!

బాబ్రీని కూల్చింది
ఐక్యతను పూడ్చింది
కమలమే కమిలింది
ఓ కూనలమ్మ!






సెల్ ఫోన్‌లలో సొల్లు
టాక్‌టైం నిల్వ నిల్లు
ఆ జేబుకిక చిల్లు
ఓ కూనలమ్మ!




గడ్డి మేసెను లాలు
గద్దెనెక్కె ఇల్లాలు
పదవిలేదా సోలు
ఓ కూనలమ్మ!



సంసారం కోరస్!
అనుమానం వైరస్!
లవ్ యాంటీ వైరస్!!
ఓ కూనలమ్మ!



మాయవతి మాయలు
ములా'యముని'లీలలు
సిగ్గులేని నేతలు
ఓ కూనలమ్మ!



నివురు కప్పు నిప్పును
తప్పు మింగు ఒప్పును
నీతి కనులు విప్పును
ఓ కూనలమ్మ!

లేదు నీతి నేతకు
రాదుగా మతి ప్రజకు
కులం కత్తి నేతకు
ఓ కూనలమ్మ!






మూడు రంగుల జండ
అవాలి పేదలండ
ఇకదే మన అజెండ
ఓ కూనలమ్మ!



తగ్గి ఉండుట మంచి
మంచి నిలుపుము పంచి
పంచి పెంచు సహించి
ఓ కూనలమ్మ!




ఒకడికి నీతి కిత్తు
వేరొకడికి జిత్తు
నీతి కావలె సొత్తు
ఓ కూనలమ్మ!



లేదిల దేశభక్తి
అంతా దైవభక్తి
ఉత్సవాల్లో రక్తి
ఓ కూనలమ్మ!




పేరు చివరన కులం
మెడలో గోల్డు తులం
కావవి మన శీలం
ఓ కూనలమ్మ!

పుచ్చుకొనుట ఇష్టం
ఇచ్చుకొనుట కష్టం
కట్నాదులు భ్రష్టం
ఓ కూనలమ్మ!






ఫబ్బు సంస్కృత్యాది
విష సంస్కృతి పాది
దేశ సంస్కృతేది?
ఓ కూనలమ్మ!

కాలే అగరొత్తులు
మరణశయ్య గుర్తులు
చితాబస్మ జాడలు
ఓ కూనలమ్మ!





కర్షకుల కన్నీరు
శ్రమశక్తి మున్నీరు
దళార్లకు పన్నీరు
ఓ కూనలమ్మ!

దైవం వ్యాపారము
భక్తులూ అపారము
మతకలహాల దురము
ఓ కూనలమ్మ!






మాట మరుచు నేతలు
నిలదీయరీజనులు
ఒకతంతు ఎన్నికలు
ఓ కూనలమ్మ!




యు.ఎస్.ది అగ్రవాదం
పాక్‌ది ఉగ్రవాదం
మానవతే వేదం
ఓ కూనలమ్మ!



గడ్డితినే నేతలు
కాపలాగ కుక్కలు
నీతి-న్యాసు కల్లలు
ఓ కూనలమ్మ!

పిల్లలకు పరీక్షలు
భక్తులకు దీక్షలు
దొరలకేవి శిక్షలు
ఓ కూనలమ్మ!





లోకాన్ని పసిగట్టు
సత్యాన్ని కనిపెట్టు
దురాత్ముల పనిపట్టు
ఓ కూనలమ్మ!




లైల.మజ్నూ లవర్స్
మెహతాలూ బ్రోకర్స్
కావాలిక థింకర్స్
ఓ కూనలమ్మ!




ముహూర్తానికి క్లాప్‌లు
రిస్క్ షాట్స్‌లలో డూప్‌లు
'ఎ'కానివన్ని ఫ్లాప్‌లు
ఓ కూనలమ్మ!

రాజుకు పదవి మెట్టు
పేదకు పెదవి గట్టు
అంతరం లోగుట్టు
ఓ కూనలమ్మ!






థీవ్స్‌కు పోలీస్ భయం
వీర్కి నేతల భయం
వీళ్ళకు స్కాంలు ప్రియం
ఓ కూనలమ్మ!

వాగ్దాన గేలాలు
ఎరగ చిక్కె జనాలు
నేత నంజు ముక్కలు
ఓ కూనలమ్మ!



## డా॥తలతోటి పృథ్వీరాజ్ ఇండియన్ హైకూ క్లబ్ వ్యవస్థాపకునిగానేగాక అత్యధిక హైకూ సంపుటాలు వెలువరించిన హైకూ కవిగా...



పృథ్వీ పరిచయం చేసిన తంకా,ఫోటోహైకూ,సెన్ర్యూ కవితా ప్రక్రియలు    పృథ్వీ సంకలన కర్తగా తీసుకొచ్చిన హైకూ సంకలనాలు



పృథ్వీరాజ్ దీర్ఘకవితా సంపుటాలు    పరిశోధనాత్మక వ్యాస సంపుటాలు    నానీ సంపుటి    నానీ సంకలనం    కవితాత్మక సంపుటి



పృథ్వి సంకలన కర్తగా రూపొందించిన ఇ-బుక్స్    డిజైనింగ్, టైపింగ్ అన్నీతానై పృథ్వీరాజ్ రచించి వెలువరించిన పలు ఇ-బుక్స్...




హైకూ, సంవీక్షణ పత్రికల సంపాదకునిగా పృథ్వీరాజ్ వెలువరించిన పత్రికల్లో కొన్నింటి ముఖచిత్రాలు




డా॥తలతోటి పృథ్వీరాజ్ రూపొందించి నిర్వహిస్తున్న అనేక సాహితీ వెబ్‌సైట్స్-బ్లాగ్స్‌లలో కొన్నింటి హోం పేజీ ముఖచిత్రాలు



## డా॥తలతోటి పృథ్వీరాజ్ రూపకర్తగా, వ్యాఖ్యాతగా రూపొందించిన 250 సాహితీ ఆడియో,వీడియో సీ.డీ.లలో కొన్నింటి ముఖచిత్రాలు




## తెలుగు సినిమా మాటలు, పాటల పరిశోధకునిగా,వ్యాఖ్యాతగా ఆత్రేయ,ఆరుద్ర,మోదుకూరి, మైలవరపు గోపి మొ॥వారిపై రూపొందించినవి.



















డాక్యుమెంట్స్,
షార్ట్‌ఫిలిమ్ మేకర్‌గా..



రచన,స్వరకర్త,
గాయకునిగా పృథ్వీరాజ్



పృథ్వీరాజ్
నటునిగా...



సామాజిక సమస్యలపై
ఉద్యమిస్తూ...



మల్టీమీడియా
సాఫ్ట్‌వేర్స్ ఉపయుక్తగా...

డా॥తలతోటి పృథ్వీరాజ్ చిత్రకారునిగా, సాహితీ సంపుటుల కవర్ పేజీల డిజైనర్‌గా, కార్టూనిస్ట్‌గా వేసినవాటిలో కొన్ని....



డా॥తలతోటి పృథ్వీరాజ్ పలు సాహిత్యాంశాలపై, పలు సాహితీ సంస్థల వేదికలపై సాహిత్యోపన్యాసకునిగా పాల్గొవాటిలో కొన్ని...



పృథ్వీరాజ్ పలు సాహిత్యాంశాలను అర్థవంతంగా పవర్ పాయింట్‌గా రూపొందించి పలు వేదికలపై ప్రదర్శించిన వాటిలో కొన్ని...



డా॥తలతోటి పృథ్వీరాజ్ ఇండియన్ హైకూ క్లబ్ వ్యవస్థాపకునిగా నిర్వహించిన శతాధిక కార్యక్రమాల ఫోటోలలో మచ్చుకి కొన్ని...



## డా॥తలతోటి పృథ్వీరాజ్ ఆత్రేయ సాహితీ స్రవంతి వ్యవస్థాపకునిగా నిర్వహించిన కార్యక్రమాల ఫోటోలలో మచ్చుకి కొన్ని



## అనకాపల్లి యంగ్ పొయిట్స్, యువతరంగాలు సంస్థల వ్యవస్థాపకునిగా నిర్వహించిన కార్యక్రమాల ఫోటోలలో మచ్చుకి కొన్ని



## డా॥తలతోటి పృథ్వీరాజ్ సాహిత్య, సాంస్కృతిక కృషిపై వివిధ దినపత్రికలలో ప్రచురింపబడిన పదులకొద్ది వ్యాసాలలో కొన్ని



టాలెంట్ షో

సాంకేతిక సాహితీ సౌరభం..

నానీలకు ప్రాచుర్యం

ప్రయోగాల వృష్టి

'కవి' తలతోటి

సాహితీవేత్తలకు సైదోడు

## పృథ్వీరాజ్ కవిత్వంపై మద్రాసు, ఆంధ్ర విశ్వ విద్యాలయాలలో జరిగిన, జరుగుతున్న ఎం.ఫిల్.,పిహెచ్.డి. పరిశోధనలలో కొన్ని




పృథ్వీరాజ్ కవిత్వంపై పరిశోధనలు

ఈనాడు 1డిసెంబర్ 2013



పృథ్వీరాజ్ కవిత్వంపై పరిశోధనలు



తలతోటి కవితలపై పరిశోధనలు

## వివిధ సంస్థలు ప్రకటించగా వారినుండి డా॥తలతోటి పృథ్వీరాజ్ స్వీకరించిన పలు సాహితీ పురస్కారాలు, అవార్డులలో కొన్ని...











## వివిధ సాహితీ-సాంస్కృతిక సమావేశాలలో పలు సంస్థలు డా॥తలతోటి పృథ్వీరాజ్‌ను సన్మాన-సత్కారాలతో గౌరవిస్తున్న దృశ్యాలలో కొన్ని

వంగపండు గారిచే..

సోమేపల్లి, పాపినేని గార్లచే...

ఎన్.గోపి, సి.నా.రే. గార్లచే...

ఆచార్య జయదేవ్ గారిచే...

డా॥తలతోటి పృథ్వీరాజ్ ఆకాశవాణి, విశాఖపట్నం కేంద్రంలో కవితా పఠనం, సాహిత్యోపన్యాస కార్యక్రమాల రికార్డింగ్‌లలో...



*www.youtube.com* లో *kavitalathoti* పేరుతో రూపొందించి అప్ లోడ్ చేసిన వందలాది సాహితీ వీడియోల ముఖచిత్రాలలో కొన్ని...



వివిధ సందర్భాలలో డా॥తలతోటి పృథ్వీరాజ్ విద్యా-సామాజికరంగ ప్రముఖులతో దిగిన ఫోటోలలో కొన్ని...



వంగపండుతో... చలంతో... రావి రంగారావుతో,.కార్టూనిస్ట్ బాలితో.,బాలమోహన్‌దాస్‌తో, రంగరాజన్‌తో... ఎం.పి.తో...

## ఇంటర్వ్యూలు, సమావేశాలకు ఆహ్వానించిన సందర్భంలో పృథ్వీరాజ్ సాహితీ,సినీరంగ ప్రముఖులతో దిగిన ఫోటోలలో కొన్ని...


రావూరి భరద్వాజతో...


కవి శివారెడ్డితో...


కవి ఆశావాదితో...


ద్వా.నా.శాస్త్రితో...


ఇనాక్ తో...


కవి ఇస్మాయిల్‌తో...


ఆకెళ్ళతో...


గొల్లపూడితో...


పద్మావతి ఆత్రేయతో...


జె.కె.భారవితో...


డి.వి.నరసరాజుతో...


రామానాయుడుతో...


దివాకర్‌బాబుతో...


బొల్లిముంతతో...


శ్రీరామచంద్రతో...


రజనీకాంతారావుతో...


వి.ఎ.కె.తో...



డాక్టర్ సత్రీ
ఆకాశవాణి న్యూస్ రీడర్,
పత్రికా రచయిత, ప్రొఫెసర్ ఆఫ్ ఇంగ్లిష్,
మారిస్ స్టెల్లా పి.జి.కళాశాల, విజయవాడ.



డా॥తలతోటి పృథ్వీరాజ్
కవి, సాహిత్యోపన్యాసకులు

## సామాజికుడు పృథ్వీ కవితారాజ్‌కు సెబాసులు

మహాభారతానికి పద్దెనిమిది పర్వాల్లా పృథ్వీరాజ్‌తో నా మిత్రత్వానికీ పద్దెనిమిదేళ్ళు. హైకు కవిత్వంపై పీహెచ్డీ పట్టాకోసం పరుగులు తీస్తూ 2003లో అనకాపల్లి వచ్చిపడ్డా. అదిగో అపుడే అనకాపల్లి బెల్లం ముక్కలూ, అంతే మధురమైన స్నేహం రెక్కలూ నా మనసును తడిమాయి. ఇండియన్ హైకూ క్లబ్ భుజాన వేసుకున్న పృథ్వీరాజ్ సెన్ర్యూలు, ఫోటో హైకూలతో లఘుకవితా ప్రక్రియల వ్యాపకుడిగా చెలరేగిపోయాడు. నిజానికి పృథ్వీరాజ్ కేవల అధ్యాపకుడు కాదు...అంతకు మించి. తనమట్టుకు తాను కేవల కవి కాదు.

బతికినన్నాళ్ళూ సినీగీతాల సాక్షిగా అంత్యప్రాసల్లో మునిగి తేలి తెలుగు కవిత్వాన్ని ఉక్కిరిబిక్కిరి చేసిన ఆరుద్ర సృజించిన కూనలమ్మపదాలు ఆరోజుల్లో కుర్రకలాల్ని ఓ ఊపు ఊపాయి. నవతరం పాఠకులకి 45 కూనలమ్మ పదాల్ని రుచిచూపిన పృథ్వీరాజ్ అభినందనార్హుడే.**"లోకాన్ని పసిగట్టు/సత్యాన్ని కనిపెట్టు/దురాత్ముల పనిపట్టు/ఓ కూనలమ్మ"**అంటూ పృథ్వీరాజ్ కూనలమ్మపదాల్ని సామాజికం చెయ్యడంలో సఫలుడయ్యాడు. **"తెల్లదొరలు పోయెను/నల్లదొరలు వచ్చెను/దోపిడీలు హెచ్చెను/ఓ కూనలమ్మ"**అంటూ దగాపడ్డ భారతావనిని దర్శింపజేశాడు. **"నివురు కప్పు నిప్పును/తప్పు మింగు ఒప్పును/నీతి కనులు విప్పును/ఓ కూనలమ్మ"**అంటూ ఆశావాదం ప్రకటించాడు. **"పేరు చివర కులం/మెడలో గోల్డు తులం/కావవి మన శీలం/ఓ కూనలమ్మ"**అంటూ యువతరం తుప్పు నిప్పై కాల్చాడు. **"కొరివి పెట్టును సుతులు/కూడు పెట్టు కూతులు/ఆడబిడ్డలె మేలు/ఓ కూనలమ్మ"**అంటూ లింగ వివక్షని చీల్చి చెండాడాడు.

పృథ్వీ కూనలమ్మ పదాలు సంపుటి ద్వారా సామాజికుడిగా సెబాసు అనిపించుకున్నాడు. డా॥తలతోటి పృథ్వీరాజ్. కుళ్ళు కంపుకొడుతున్న సంఘాన్ని అన్ని కోణాల్లో పాఠకుల ముందు ఆవిష్కరించాడు. అన్ని పదాలు కవితా పరిమళాలతో అమరక పోవచ్చు. వాక్యం రసాత్మకం కావ్యం అన్న చందంగా తాటిముంజెల్లాంటి పృథ్వీ కూనలమ్మ పదాలలో కొన్నయినా లేతగా మనసు నోటిని ఊరిస్తాయనటం సత్యదూరం కాదు. సామాజిక ప్రయోజనమే పరమ కవితాపథ సోపానంగా 20 కే...రన్ చేపట్టిన పృథ్వీరాజ్ కి పచ్చజెండా ఊపుతూ...కవితా పత్రహరితంతోనే కాలుష్యపు కోరల్లో చిక్కిన ఈ ధరిత్రికి విమోచన అని గుడ్డిగా నమ్ముతూ కవితా సేవకుడు ...సత్రీ